చెప్పివేయఁగా, ఆయన వెనుకకు జరపి మేడను తమస్థలములోనే కట్టుకొనిరి. సభవారి యనుమతినిపొంది నాయఁడుగారిప్పు డాస్థలములో మేడముందు పందిరి వేసికొనియున్నారు. న్యాయవిషయమున మొగమోటపడక మిత్రుని మాటనైనను నేను నిరాకరించుచుండెడువాఁడను.

నాగోజీరావు పంతులుగారు పాఠశాలల పరీక్షకులయి రాజమహేంద్ర వరము విడిచి నప్పుడప్పటి యుపకరగ్రాహి (Sub-Collector) యయిన హామ్మెట్టు దొరగారు పారిశుద్ధ్య సంఘాధ్యక్షత్వమునకై ప్రయత్నించిరి. మాశాస్త్ర పాఠశాలలో ప్రధానోపాధ్యాయులైన మెట్కాఁ-ఫు దొరగారును ద్వితీయోపాధ్యాయులైన సుందరరావుగారును, నేనును ముగ్గురము పారి శుద్ధ్య విచారణ సంఘములో సభ్యులముగా నుండెడివారము. కొంచెము కాలముక్రిందట నిన్నీసుపేట పాఠశాలలోనిచ్చిన యొక యుపన్యాసమునందు సుందరరావుగారు యూరపియనులను మిక్కిలి నిరసించుచు మాటాడిరి. అందుచేత నాతఁడు యూరపియనులను లక్ష్యముచేయని స్వతంత్ర బుద్ధిగలవాఁ డని నేను భావించియుంటిని. ఒకనాఁడు మెట్కాఁ-ఫు దొరగారు పారిశుద్ధ్య విచారణ సంఘాధ్యక్షత్వమునకు హామ్మెట్టుగారి పేరు నిర్దేశించుచు నొక కాగితముల్రాసి దాని కనుమోదించి క్రింద వ్రాలుచేయుటకయి నాయొద్దకు తీసికొనివచ్చిరి. దొరతనమువారు స్థానిక స్వప్రభుత్వము నిచ్చుటవలని ప్రయో జనము సభ్యులు స్వతంత్రముగా పనిచేయుటకొఱకనియు, దండనాధికారము గలవా రధ్యక్షులయినప్పుడు సభ్యులు స్వతంత్రులయి నిర్భయముగా వర్తిం చుట పొసఁగదనియు, అందుచేత సభ్యులు దండనాధికారము లేనివారినె యధ్యక్షునిగా కోరుకొనుట నాయభిమతమనియు, కాఁబట్టి నేనిందులో వ్రాలుచేయక పోవుటయేకాక నియామక దినమునందు నేను వ్యతిరేకముగా మాటాడెదననియు, చెప్పితిని. నేనన్న మాట తిరుగువాఁడను కానని యెఱిఁ గినవారయి నన్ను విడిచి దొరగారు కాగితమును సుందరరావుగారి యొద్దకు తీసికొనిపోఁగా, ఆయన తన స్వాతంత్ర్యమును విడనాడి మాఱుమాటాడక వెంటనే దానిమీఁద వ్రాలుచేసెను. అధ్యక్షుని నియమించుకొను దినమువచ్చి

నప్పుడు సభలో దండవిధాయకుఁడైన హాస్మెట్టు దొరగారిని కోరకొనక యధ్యక్షత్వమునకు వేఱొకనిని కోరుకొనవలసినదని నేను చెప్పితినిగాని సభ్యులుపకరగ్రాహిగారి యభీష్టమునకు వ్యతిరేకముగా నడచునంతటి ధైర్యశాలులు కానందున వారినే యధ్యక్షునిగాఁ గోరుకొనిరి. కరగ్రాహక కార్యములలోను దండనీతి ప్రయోగకార్యములలోను విశేష కాలము గడపవలసినందునను తఱుచుగా రాజకార్య విషయమున గ్రామాంతర సంచారము చేయవలసినందునను పుర పారిశుద్ధ్య విచారణ సంఘకార్యములలో తగినంత శ్రద్ధచేయుట కవకాశము లేనివారయి హాస్మెట్టుదొరగారు పారిశుద్ధ్యసంఘ వ్యవహారములను చక్కఁబెట్టుటకయి తమ పక్షమున నొక్క ప్రతినిధి నేర్పఱుపఁగోరి సభ్యులలో నట్టిపనికెవ్వరు సమర్థులని మెట్కాపు దొరగారి నాలోచనయడిగిరి. వారు సుందరరావుగారిని పేర్కొనక నాపేరు చెప్పిరి. అందుమీఁద హాస్మెట్టు దొరగారు నన్నడుగఁగా నుద్యోగనియామకములు మొదలుగాఁగల సమస్తవిషయములలోను నాకు సర్వస్వాతంత్ర్యముల నిచ్చినఁగాని నేనాపని నంగీకరింపనంటిని. ఆయనయందున కొప్పుకొని సభ్యులయనుమతితో తమయధికారముల నన్నిటిని నాకు సంక్రమింపఁజేసెను. నేను యథాశక్తిని పనిచేసి ముఖ్యవిషయములలో నెల్లదొరగారితో నాలోచించి యాయన యంగీకారమును బడయుచు లంచములు మాన్పుటకును కార్యస్థాన వ్యవహారము లవిలంబముగాను యథాక్రమముగాను జరుపుటకును పన్నులవిషయమున మార్పులుచేసి యాయమును వృద్ధిపఱుచుటకును పాటుపడితిని. అంతకు పూర్వమిండ్ల పన్నులెక్కువగానురిడవలసినవారికి తక్కువగాను తక్కువగా నుండవలసిన వారికెక్కువగాను కట్టఁబడి యుండెను. నేను ప్రతిగృహమును తిరిగిచూచి తక్కువ పన్నులున్న కొందఱు ధనికులయిండ్లకు హెచ్చుచేసి యెక్కువపన్నులున్న కొందఱు బీదలయిండ్లకు తగ్గించి యంగడివీధినున్న కొట్లపైని న్యాయమైన పన్నులు విధించి మొత్తముమీఁద పారిశుద్ధ్య సంఘమునకుధనాగమ మెంతో హెచ్చునట్లుచేసితిని. సరిగా నెలకు పదేసిరూపాయలును అంతకంటె నెక్కువ

గాను అద్దెలు వచ్చుచుండిన కొట్లు కావలసు నెలకొనిమ్మిదణాలద్దె రాఁదగినట్లు నిర్ణయించి కట్టిన పన్నులను పెంపుచేయుటచేత ముఖ్యముగా నీధనాగమము హెచ్చినది. ఈపన్నుల విషయమయిన మార్పుచేసినతరువాత వితంతు వివాహవిషయమున నాకు ప్రతిపక్షులుగా నుండిన వైదికులు తమకు పన్నులు హెచ్చుచేయఁబడునని భయపడితిమనియు నట్లు జరగక కొన్ని విషయములలో తగ్గింపఁబడి న్యాయము జరగెననియు తమతోఁ చెప్పి నన్ను శ్లాఘించిరని చల్లపల్లి రంగయ్యపంతులుగారు నాతోఁ జెప్పిరి. హామ్నెట్టు దొరగారిచ్చట నుండి మార్పఁబడి వెళ్లనున్న సమయమునందు 1886 సంవత్సరము 17-వ సెప్టెంబరున నాకిట్లు వ్రాసిరి.—

"I must tender you my sincere thanks for the assistance you have given me and the untiring energy you have displayed in connection with the Municipality during the last few months, I am convinced that you are the best man to fill the post of Chairman, but you see a system of free election by ballot does not always result in the best men being returned." (కడచిన కొన్ని మాసములలోను పారిశుద్ధ్య విచారణసంఘ సంబంధమున మీరు నాకుచేసిన సాహాయ్యమునకును మీరు కనఁబఱిచిన విరామములేని శక్తికిని నా హృదయపూర్వకములైన వందనములను మీకు సమర్పింపవలసియున్నది. అధ్యక్షపదమును పొందుటకు మీరు ప్రశస్తతములని నేను జాతనిశ్చయుఁడనయి యున్నాను కాని గుళికాపాతముచేత స్వతంత్రవరణము చేయుపద్ధతి యెల్లప్పుడు నుత్తమపురుషులే నియోగింపఁబడుటలో పర్యవసిరిప దని మీరు కనుఁగొనుచున్నారు.)

ఈప్రకారముగా దొరగారి శ్లాఘనన్ను పడసినంతమాత్రముచేత నెల్ల విషయములయందును నేనాయన యిష్టానుసారముగా వర్తించుచుండినట్లు మీరు తలఁపఁగూడదు. కొన్ని సమయములయందాయన చెప్పినదానికి ప్రత్యక్షవిరుద్ధముగాచేసి, మీరు చెప్పినది తప్పని నిర్భయముగా మొగముమీఁద నే

యసెడివాఁడను. నావర్తనమువలన ముందురాఁగల ఫలమును లేశమును విచారింపక స్వదేశీయుఁడైనను విదేశీయుఁడైనను హిందువైనను యూరపియనైనను లక్ష్యముచేయక నేను మంచిదనుకొన్నదానిని మొగము ముందఱ ననివేయునట్టియు నిర్భయముగా చేయునట్టియు తొందర స్వభావము నాకుఁగల లోపములలో నొకటి. ఈవేగిరపాటువలన మనవారిలో కొందఱు నాకప్పుడప్పుడు ద్వేషులగుటయు సంభవించుచువచ్చెను. అధ్యక్షులను కోరుకొను స్వాతంత్ర్యమియ్యఁబడుటకు పూర్వము పురపారిశుద్ధ్య విచారణ సంఘములకు మండలకరగ్రాహు లధ్యక్షులుగాను, ఉపకరగ్రాహులు మొదలైనవారధ్యక్ష ప్రతినిధులుగాను, ఉండుచువచ్చిరి. రాజమహేంద్రపుర పరిపాలక సంఘమునకుపకరగ్రాహి యధ్యక్ష ప్రతినిధిగానుండిన కాలములో జరగిన యొక సభలో విచారణీయములైన ముఖ్యాంశము లనేకములుండెను. కొన్ని యంశములు చర్చింపఁబడి నిర్ధారణములు చేయఁబడినతరువాత నప్పటికే కాలాతీతమయినందున దొరగారు నిర్ధారణములపుస్తకములో వ్రాలుచేసి సభనువిడిచి వెడలిపోయిరి. అప్పుడు మిగిలియున్న కొన్ని యంశములను గూడ నీసభలోనే చర్చించి నిర్ధారణములుచేసి మఱి యిండ్లకు పోదమని నేను సభ్యులతోఁజెప్పితిని. కార్యస్థాన కార్య నిర్వాహకుఁడన్ని నిర్ధారణములను దొరగారు చేసియే పోయిరని చెప్పెను. మాయభిప్రాయములను గైకొనక తమ మనసువచ్చినట్లు నిర్ధారణములు వ్రాసిపోవుటకు దొరగారికేమియధికారము కలదని నేను పలికితిని. సభ్యులందఱును నేనన్నది న్యాయమని తలఁచినను దొరగారు చేసిన దానిని మార్చుట కెవ్వరికిని చొరవలేకుండెను. సభవారి యనుమతితో నేను సాహసించి యగ్రాసనాసీనత్వము వహించి, దొరగారు కోపపడుదురని కార్యనిర్వాహకుఁడు మొఱ్ఱపెట్టుచున్నను వినక మార్పవలసిన నిర్ధారణములనుమార్చి వానిక్రింద నావ్రాలుచేసితిని. సభ ముగియఁగానే కార్యనిర్వాహకుఁడు నిర్ధారణముల పుస్తకమును తీసికొనిపోయి నేనుచేసిన దుండగమును దొరగారికి విన్నవించి పుస్తకమును జూపెను. దొరగారు మార్పులనుజూచి మంచిదనిపలికి

పుస్తకమును మరల నిచ్చివేసెను. ఆయన కాలవిలంబమున కోర్వకయావలి కున్న యాచారమునుబట్టి తమకు తోఁచిన నిర్ధారణములను వ్రాసిపోయిరే కాని యట్లు చేయుటలో వారికి లాభమేదియులేదు. సభ్యులలో ననేకులు దొరగారి యభిప్రాయ మేదో మాయభిప్రాయమదేయని తలయూఁచువారే కాని తమ స్వతంత్రతను చూపువారు కాకుండిరి. సభ్యులే యాలోచించి తమ స్వతంత్రాభిప్రాయము నిచ్చువారయిరేని, అధికారులు వారిసాయమును సంతోషపూర్వకముగా పొందుచుండెడివారే. స్వతంత్రించి నిర్భయముగా నధికారుల యభిప్రాయమునకు వ్యతిరేకముగా తమ యభిప్రాయమును తెలుపలేని లోపము మనవారియందే విశేషముగానున్నది. దీనికి నిదర్శనముగా నొక్క సంగతిని చూపెదను.

నాదేహ మస్వస్థముగా నున్నందున రాజమహేంద్రవరములోనే జరగిన యొక తాలూకా సంఘ (Taluq Board) సభకు నేను పోలేక పోయితిని. సభ ముగిసినతరువాత కొందఱు సభ్యులు నన్ను చూడవచ్చిరి. ఏమేమి విశేషములు జరగినవని నేనడగినమీఁదట వారిలోని విద్యాధికులే యొకరు దొరగారు మమ్మడిగి మాయభిప్రాయములను గైకొన్నారా యేమేమి నిర్ధారణములుచేసిరో మాకు తెలియనిచ్చిరా యని నాకుత్తరమిచ్చెను. అట్లు జరగనిచ్చుట మీ దేతప్పిదమనిపలికి నేనూరకుంటిని. ఆపయి నెలలో జరగిన సభలో వారు మొట్టసెట్టిన మోబర్లీ దొరగారే యగ్రాసనాసీనులయియుండిరి. ఒక విషయమున దొరగారికిని నాకును నభిప్రాయభేదము కలిగి కొంత వివాదము నడచెను. దొరగారు తమ యభిప్రాయమును సభ్యులకు తెలుఁగులో వివరించి తెలుపవలసినదని సభలోనున్న తహాశ్శీలుదార్లతో చెప్పిరి. వారట్లు చేసిన పిమ్మట దొరగారి యభిప్రాయముపైఁ గల యాక్షేపణలను తెలుఁగులో నేను సభ్యులకు తెలిపితిని. దొరగారు నేను చెప్పినదానికు త్తరము చెప్పిరి; దానికి నేను ప్రత్యుత్తరము చెప్పితిని. ఈప్రకారముగా కొన్ని నిమిషములు నడచిన తరువాత దొరగారు తమపట్టునువిడిచి నాయభిప్రాయ ప్రకారముగానే నిర్ధార

ణము చేసిరి. అటుతరువాత సభ్యులయొక్కయు ముఖ్యముగా నాయొక్కయు నభిప్రాయమును గైకొనకుండ నొక్క నిర్ధారణమునైనను దొరగారు చేయలేదు. ఒక్క పురపారిశుద్ధ్యవిచారణసంఘ వ్యవహారములలోనే కాక తాలూకా సంఘ (Taluq Board) వ్యవహారములలోను మండల సంఘ (District Board) వ్యవహారములలోను కూడ తగినంత శ్రద్ధచేయుచునే యుండెడివాఁడను. సభాధ్యక్షుఁడుగాని యధ్యక్షప్రతినిధిగాని రానప్పుడు నేనగ్రాసనాసీనత్వము వహించుటయుఁగలదు. 1888-వ సంవత్సరము మెయినెల 29-వ తేదిని జరగిన గోదావరీ మండల సంఘ (District Board, Godavari) సభలో 15 గురు సభ్యులుండి వారిలో నిరువురు తహశ్శిలుదారు లుండినను, అగ్రాసనాధిపత్యమునకు నన్ను నియమించిరి.

ఈసమయమునందు నేను రెండు పాఠశాలలకు కార్యనిర్వాహక సంఘ సభ్యుఁడనుగా నుండుటయేకాక యిన్నీసుపేట బాలికా పాఠశాలకు కార్యనిర్వాహకుఁడనుగా నుంటిని. బాలకుల పాఠశాలలోవలె బాలికల పాఠశాలలో బాలికలు జీతము లియ్యక పోవుటచేత దానిని భరించుట యెక్కువ కష్టముగా నుండెను. ఈపాఠశాలను నేను చందాలమూలమునను పురపారిశుద్ధ్యసంఘము వారును దొరతనమువారును వేఱువేఱుగానిచ్చు సహాయద్రవ్యము వలనను భరించుచుంటిని. ఇట్లుండఁగా 1885-వ సంవత్సరము మార్చినెల 3-వ తేదిని రాజమహేంద్రవర పురపరిపాలకాధ్యక్షుని యొద్దనుండి నాకీ క్రిందియుత్తరము వచ్చినది.—

"In their order No. 292 dated 19th February 1885 reviewing the budget of the Rajahmundry municipality for the year 1885-86, the Govt. have disallowed the payment of salary grant to your school for next year from the municipal funds and said that salary grant to Girls' Schools will, under G.O. No. 206 dated 31st January 1885, be paid in future from Provincial funds. I have therefore the honor to inform you

that no salary grants will be paid to your School from the commencement of the next official year out of the Municipal funds.' (1885-86, సంవత్సరమునకు రాజమహేంద్రపుర పరిపాలక సంఘముయొక్క యాయవ్యయ గణనపట్టికను విమర్శించుచు 1885-వ సం॥ 12-వ ఫిబ్రవరి 292-వ సంఖ్యగల తమ యుత్తరువులో దొరతనమువారు మీపాఠశాలకు నగర పారిశుద్ధ్య విచారణసంఘమువారి ధనములోనుండి జీతముల సహాయద్రవ్యమునిచ్చుటను నిషేధించి, బాలికాపాఠశాలలకు జీతముల సహాయధనము 1885-వ సం॥ జనవరు 31-వ తేది 206 సంఖ్యగల దొరతనమువారి యుత్తరువునుబట్టి యిఁకముందు రాష్ట్రీయ ధనములోనుండి యియ్యఁబడునని చెప్పియున్నారు. కాఁబట్టి పయి వ్యావహారిక సంవత్సరారంభమునుండి పురపరిపాలకసంఘ ధనములలోనుండి మీపాఠశాలకు జీతముల సహాయద్రవ్యమియ్యఁబడదని నేను మీకు తెలియఁజేయుచున్నాను.)

ఈయుత్తరము వచ్చిన శీఘ్రకాలములోనే చెన్నపురి రాజధానీ విద్యావిచారణకర్తగారు రాజమహేంద్రవరమునకు వచ్చుట తటస్థింపఁగా, నేనాయనను కలిసికొని మాపాఠశాలవిషయమై మాటాడి యాయనచేత బలముగా మాబాలికాపాఠశాల కనుకూలముగా వ్రాయించిన మీఁదట దొరతనమువారు విశేషవిషయముగా మాపురపరిపాలక సంఘ ధనములోనుండి యథాపూర్వముగా సహాయధన మిచ్చునట్లుత్తరువుచేసిరి. నాకు మొదటినుండియు స్త్రీవిద్యయందధికాభిమానము. స్త్రీలస్థితి బాగుపడినఁగాని దేశము బాగుపడదని నానమ్మకము. ఇట్లు బాలికాపాఠశాల స్థిరపడిన పిమ్మట వారవారమును ప్రకటింపఁబడు వివేకవర్ధని తోడిపాటుగా సతీహితబోధినియను స్త్రీల కుపయోగించు మాసపత్రిక నొకదానిని మూడుసంవత్సరములు నడపి స్త్రీల నిమిత్తమయి సత్యవతీ చరిత్రము, చంద్రమతీ చరిత్రము, సత్యసంజీవని, పత్నీహిత సూచని, దేహారోగ్య ధర్మబోధిని మొదలగు పుస్తకములను రచించితిని. ఈసమయమునందు మాయూరి ప్రార్థన సమాజమునందు వారవారమును

జరిగెడు సభలలో నేను తఱుచుగా ధర్మోపన్యాసములు చేయుచుండెడివాఁడను. 1881–90 సంవత్సరములకు నడుమను పయిని జెప్పిన పుస్తకములను గాక చమత్కార రత్నావళి, రాగమంజరి నాటకముల నింగ్లీషునుండియు రత్నావళీ మాళవికాగ్నిమిత్రనాటకములను సంస్కృతమునుండియు తెలిఁగించి, ప్రహ్లాదనాటకము దక్షిణగోగ్రహణము, సత్య హరిశ్చంద్రనాటకము అను రూపకములను, కొన్ని నాటక కథలను, ప్రహసనములను, ఆంధ్రకవుల చరిత్రమును రచించితిని. ఇవిగాక వితంతువివాహవిషయమునను, ఇతర విషయమునను, పెక్కుపన్యాసములు వ్రాసి ప్రచురించితిని; పూర్వకవిప్రణీత గ్రంథములను కొన్నిటిని సంస్కరించి ప్రకటించితిని.

ఆకాలమునందు మాపట్టణములో బాలురవిద్య యత్యధమస్థితియందుండెను. సునిర్మితములయిన సభలయొక్క పాలనముక్రిందనుండి చక్కగా నడపఁబడుచుండిన రెండు పాఠశాలలకును పోటీగా ధనార్జనాభిలాషచేతను కీర్తికామిత్వముచేతను కొందఱు బుద్ధిమంతులు నీతిమతధర్మబోధన మొనర్చెదమనియు సద్విద్య గఱపెదమనియు సులభ జ్ఞానదానముచే బీదల కుపకారముచేసెదమనియు పలుమిషలు పెట్టి యాస్తికపాఠశాలయనియు మహారాష్ట్రపాఠశాలయనియు స్వదేశాభిమానిపాఠశాల యనియు పెద్ద పెద్ద పేరులు పెట్టి క్రొత్త క్రొత్త పాఠశాలలను పెట్ట మొదలుపెట్టిరి. ఇట్టి పాఠశాలలకెల్ల మొట్టమొదట దారి చూపినది నేతిబీరకాయవలె సార్థకనామము వహించిన యాస్తికపాఠశాల. ఈనూతన పాఠశాలలపోషణమునకయి నిధిలేదు, చందాలులేవు, దాన ధనములేదు. ఉపాధ్యాయులజీతములకు విద్యార్థు లిచ్చెడు నెలజీతములే యాధారము. ఇతర సుస్థిరపాఠశాలలనుండి విద్యార్థులనుసాధ్యమైనంత యెక్కువమందిని తమపాఠశాలకాకర్షించుటకయి పన్నిన యుపాయములు విద్యార్థుల వలన తక్కువజీతములను గ్రహించుట, తోడి బాలుర నెక్కువమందిని తెచ్చిన వారివలన జీతములు గైకొనకుండుట, బాలురను తగనితరగతులలోచేర్చుకొనుట, మొదలైనవి. బాలురవలన గ్రహించెడివి క్రమముగాఁ గైకొనవలసిన వానిలో నర్ధాంశమునుచతుర్థాంశమును అష్టమాంశమును షోడశాంశమును మాత్రమేయుం

డినను ప్రకటితములగు లెక్కలలో నిండుమొత్తములను, గుప్తములగు లెక్కలలో నిజమైన మొత్తములను, వేసికొని, వచ్చినసొమ్ములో కార్యనిర్వాహకుని భాగము పోఁగా మిగిలిన దాని నుపాధ్యాయులు వంతులవరుసను బంచుకొనుచుండిరి; ఉపాధ్యాయులకు ముట్టెడు మాసవేతనము లెనిమిదులును పదులును పదునైదులును మాత్రమే యయినను, ఇరువదులును ముప్పదులును నలువదులును ఏఁబదులు నైనట్టు లెక్కలలోఁ జూపఁబడి వారివలన నా పెద్ద మొత్తములకాదానికలు గైకొనఁబడుచుండెను; ఈ పెద్ద పెద్దజీతముల నిచ్చుటకయి కార్యనిర్వాహకులు తమచేతి సొమ్మును వ్యయపెట్టుచున్నట్టు చూపి దొరతనమువారివలన సహాయద్రవ్యముగా విశేషవిత్తము గైకొనఁబడుచుండెను. ఇట్టి యనుచిత కార్యముల చేత నుపాధ్యాయులే నీతిమాలిన వారయినప్పుడు వారి శిష్యులైన విద్యార్థులేమి నీతిమంతులగుదురు? ఇట్టికుతంత్ర ప్రయోగములవలన నీతిమాత్రమే కాక విద్యను సహితము విద్యార్థులు కోలుపోవుచుండిరి. ఇవియన్నియు సర్వజన విదితములైన బహిరంగ రహస్యములేయైనను వానిని స్థాపించుటమాత్రము దుర్ఘటము. ఈవిధమున విద్యకును నీతికిని నీళ్లు విడుచుచున్న విద్యార్థుల కంటె వారి సంరక్షకులలో నధిక సంఖ్యాకు లెక్కువవివేకులు కాకుండిరి. వారు తమ బాలురను క్రమ శిక్షగల పాఠశాలలకుఁ బంపక యెక్కడ తక్కువ జీతములు చేకొనఁబడునో యెక్కడ బాలు రెక్కువ తరగతులలో చేర్చుకొనఁబడుదురో యక్కడికే తమ సంరక్ష్యులను బంపుచుండిరి. అందుచేత నప్పుడు పట్టణములోని విద్యయొక్కయు విద్యార్థులయొక్కయు స్థితి దుస్థితికి వచ్చి శోచనీయమైనదిగానుండెను. కాఁబట్టి విద్యాభివృద్ధిని గోరువారికిని దేశాభిమానముగలవారికిని బాలుర నీతిపరులఁగావింప కాంక్షించువారికిని విద్యమానదుస్థితిని తొలఁగించి సుస్థితిని నెలకొల్పఁబూనుట యనివార్య ధర్మమయియుండెను. అప్పటి విద్యావిషయక విధు లిప్పటివలె కఠినములుగాక యవ్యవస్థితములై యుండినందున విగత ధార్మిక విద్యాలయములను లయము నొందించుట ఋజుమార్గవర్తనులకు శక్యముకాకుండెను. అందుచేత పాఠశాలా కార్యనిర్వాహక సంఘమున కధ్యక్షులయిన మెట్కాపు దొరగారును సంఘ

సభ్యులయిన యస్మద్దాదులును ఏవిధముచేతనైనను పాఠశాలలనన్నిటి నొక్క-టిగాఁజేర్చి యొక్క- కార్యనిర్వాహక సంఘముయొక్క- యధికారము క్రిందికిఁ దెచ్చి విద్యను బాగుచేయవలెనన్నిశ్చయించుకొని, ప్రతిపక్ష పాఠశాలలవారు కోరిన నియమములనే యంగీకరించి, వారు చెప్పిన జీతములమీఁద వారి పాఠశాలలలోని యుపాధ్యాయులఁ దీసికొనుట కొప్పుకొని, వారి పాఠశాలాధికారియైన యేలూరి లక్ష్మీనరసింహముగారినే ప్రధానోపాధ్యాయ పదమునందు నిలిపి, పాఠశాలల నన్నిటి నొక్క-టిగాఁ గలిపి యొక్క- సభవారి కార్య నిర్వాహకత్వమునకు లోఁబఱుపఁ గలిగితిమి.

ఇట్లు కలుపఁబడిన యీనూతనోన్నత పాఠశాలనిమిత్తము మందిరము కట్టుటకై పట్టణమధ్యమునందొక విశాల స్థలమును బేరమాడి క్రయనిర్ణయము చేసికొనుటకు సంసిద్ధులమయి యుంటిమి. ఇటువంటి మంచిస్థలము సులభ క్రయమునకు పోవుచున్నదని తెలిసికొని, దానిని తాను సంపాదింపవలెనని నిశ్చయించుకొని, మాసీమకు తహశ్శీలుదారుఁడుగానున్న బుద్ధిమంతుఁడు తత్క్షణమే యాక్షేత్ర స్వామిని తనయొద్దకు పిలిపించుకొని, ఆభూమిని తనవ్యారి పేర వ్రాయించుకొనెను. ఆయన శక్తి సామర్థ్యాదుల నెఱిఁగిన మావారందఱును చేతఁజిక్కి-నస్థలము పోయినదని విచారించుచు నిరాశులయి, యటువంటి ప్రబుద్ధుని హస్తగతమైన భూమియొక్క- పునరావాప్తి యసాధ్యమని భావించి, ఉత్తర కర్తవ్యమును నాకు విడిచిపెట్టి యూరకుండిరి. పోయిన భూమిని మరల రాఁబట్టుటకయి యుపాయము నాలోచించి నే నుపకర గ్రాహిగార్రి యొద్దకుపోయి మాటాడి యాయనచ్యేష నొత్తుడుకలిగించి పులినోటఁ బడ్డ గోవును విడిపించితెచ్చిన ట్లానేలను మరల పాఠశాలా కార్యనిర్వాహక సంఘమువారి యధీనమగునట్లు చేసితిని. ఇప్పుడు బోధనకళాశాలా భవనము కట్టఁబడి యున్న స్థలమిదియే.

దుర్బలశరీరుఁడనయ్యు వ్యాధిబాధితుఁడ నయ్యు నప్పుడిన్ని విధముల పాటుపడఁగలిగిన నేనిప్పుడు తొంటి జవసత్త్వములను గోలుపోయి కోరిక

లెప్పటివలెనే యున్నను కార్యములకు సమర్థముగాకయున్న నాప్రస్తుతా వస్థను దలఁచుకొనఁగా, పూర్వపు వీరేశలింగముగాక తచ్ఛాయావిగ్రహము మాత్రమే నిలిచియున్నదేమో యన్నట్టు తోఁచుచున్నది. తొల్లిటి క్రియా శక్తిలో కొంతయయినను నాకీశ్వరుఁడు మరల ప్రసాదించునుగాక!

ఇన్ని విషయములలో నే నత్యంతోత్సాహముతో పని చేయుచుండిన కాలములో నా యుత్సాహమునకు భంగకరమైన వైపరీత్య మొకటి తట స్థించెను. మిత్రభావముతోనే కాక గురుభావముతో నేను చెప్పినదాని నెల్ల శిరసా వహించి చేయుచు, నాకు కుడిభుజమయి యుండి నేను పూనిన సమస్త సత్కార్యములలోను తోడుపడుచు, స్వభావ దుర్బలుఁడనైన నన్ను శ్రమ పడకుండ సదాకంటిని ఱెప్పవలెఁ గాచుచు, వాగ్దానములుచేసినవారును ప్రతి జ్ఞలు పలికినవారును అందఱును విడిచినను తానుమాత్రము నన్ను విడువకుండిన బసవరాజు గవర్రాజు గారు ఆకస్మికముగా 1888-వ సంవత్సరము జూలయి నెల 16-వ తేదిని లోకాంతర గతులయిరి. అటువంటి సుగుణనిధియైన మిత్రరత్నము యొక్క మరణముతో నాకావఱకున్న కార్యోత్సాహము సగము తగ్గిపోయి నది. సదారోగ పీడితుఁడనగుచుండిన నేను చిరకాలము జీవింపననియు, నేను పూనిన మహాకార్యమును నాయనంతరమునం దాయన ధైర్యోత్సాహములతో నిర్వహించుననియు, నేను దృఢముగా నమ్మియుంటిని. అట్టి నాయాశ యకాలవినాశము నొందఁగా నేను విరక్తుఁడనయి, పురపరిపాలక సంఘము లోను స్థానికనిధి సంఘములలోను నాసభ్యత్వములకు పరిత్యాగ పత్రికలను బంపి తదధ్యక్షులు నన్ను విశ్రాంతి నొల్లకున్నను వలదని యాపనులనెల్ల నొక్క మాఱుగా మానుకొంటిని. గవర్రాజుగారు తనమరణమునకు నాలుగయిదు మాస ములకు ముందొకనాఁడు నాయొద్దకువచ్చి నాజీవచరిత్రమును వ్రాయుటకయి సాధనముల నిమ్మని నన్నడిగెను; నేనాయనను నిరుత్సాహపఱిచి యిప్పుడా ప్రయత్నమును మాని నామరణానంతరమున నేమయిన వ్రాయఁదగియుండిన చో వ్రాయవచ్చునని చెప్పితిని. ఈసంభాషణము జరిగిన కొన్ని మాసములలో నే

నా జీవచరిత్రమును వ్రాయ నెంచిన మిత్రుని జీవచరిత్రమును నేనే యాయన స్మృతిని శాశ్వతపఱుచుటకయి చేయఁబడిన పురమహాజనుల సభలో వ్రాసి చదువవలసినవాఁడనైతిని. నేను వ్రాసిన సంక్షేప చరిత్రమువలన నీమహాపురుషుని గుణసంపద కొంతవఱకు తేటపడవచ్చును. ఈయనస్మృతి స్థిరీకరణార్థమయి దాదాపుగా మున్నూఱురూపాయలు చందాలు వేయఁబడినవి; వేసినవారిలో కొందఱు తక్క మిగిలిన వారందఱును తాము వేసిన చందాలనుసంతోషపూర్వకముగా నిచ్చిరి. వచ్చిన సొమ్ముతో నాది కొంతచేర్చి మున్నూటయేబదిరూపాయలకు నిజరూపపరిమాణముగల చిత్రాకృతిని వ్రాయించి రాజమహేంద్రపురమందిరమునందుఁ బెట్టించితిని. ఎవరివలన మదుద్దిష్ట కార్యనిరంతర వ్యాప్తియు లోకోపకారమును కలుగునని నేనాశపడియుంటినో యట్టివారిలో నకాలమరణము నొందుట కీయన ప్రథములు; ఈయనయనంతరము నాతరువాత నిరంతరాయముగా నత్యంతోత్సాహముతో లోకోపకారకార్యమును నడుపుదురని నేను ప్రతీక్షించిన రెండవవారయిన సత్తిరాజు మృత్యుంజయరావుగారును వీరివలెనే యకాలమరణమునొంది నాయాశకు భంగము కలిగించిరి; ఆరంభింపఁబడిన సత్కార్యము నవిచ్ఛిన్నముగా జరపి లోకమునకు మేలు చేయుదురని నేనాశపడిన కడపటివారయిన దేశిరాజు పెద బాపయ్యగారును పయి యిరువురివలెనే యకాలమృత్యుదేవతవాతం బడిరి. వీరు మువ్వురును పట్టపరీక్షా సిద్ధులు; దేశాభిమాన మాననీయులు; సత్కార్యానుష్ఠాన దీక్షాపరులు; స్వార్థపరిత్యాగులు; పరోపకారరతులు; తాము సత్యములని నమ్మినవాని నాచరణమునకుఁ దెచ్చుట్కయందు దుత్సాహమును ధైర్యసాహసములును కలిగిన కార్యశూరులు. వీరు మువ్వురును యౌవనమధ్యమున స్వకృత్యాచరణారంభదశలోనే స్వర్గస్థులయిరి. ఈలోకములో మంచిపదార్థములు చిరకాలముండవు కాఁబోలును! ఆహా! ఈశ్వరేచ్ఛా విచిత్ర ప్రభావముల నెవ్వరు గ్రహింపఁగలరు!



# ప్రకటననియమములు.

1. మాకు 2800 మంది చందాదారులు కలరు. ప్రతిగ్రంథముయొక్క 4000 ప్రతులు అచ్చువేయించుచున్నాము. మాగ్రంథములు స్త్రీలు, పురుషులు చదువుదురు. మాపుస్తకములు కొన్ని యూనివర్సిటీ పరీక్షలకు నియమించియున్నారు. కొన్ని పాఠశాలలలో పఠనీయములుగా ఏర్పరచి చదివించుచున్నారు. ఈగ్రంథమాలకుగల వ్యాపకము మరి యేగ్రంథమునకును, ఏగ్రంథమాలకును లేదు. కావున దీనియందు ప్రకటనలు వేయువారికి అత్యంతలాభకారి యని మేము వేరుగ వ్రాయ నక్కరలేదు.

2. ప్రతిగ్రంథముయొక్క చివర కొన్ని ప్రకటనలు వేయుదుము. ఈ ప్రకటనలు కేవలము భాషావిషయకములు మాత్రమే అయియుండును. మందులు మొదలగునవి మేము ప్రకటించము. ఆంధ్రభాషలోని స్మృతులు, కావ్యములు, నాటకములు, నవలలు, ప్రహసనములు, దేశచరిత్రములు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు మొదలగు వానినిగురించి ఏమి తెలిసికొనవలసివచ్చినను, ఒక్కచోట చప్పున గనుపడునటుల చేయఁ దలచినారము. కావున గ్రంథకర్తలు, ప్రతికాధిపతులు తమ తమ గ్రంథములను, పత్రికలను, ఇందు ప్రకటించి ఎక్కువలాభమును బడయుదురని నమ్ముచున్నాము.

3. మాప్రకటనముల తమ పత్రికలో వేయు ప్రతికాధిపతుల ప్రకటనలు మాపుస్తకముల చివరనుచితముగా వేయఁగలవారము.

4. ఇతరులు ఒకసారి ఒకపుట ప్రకటనవేయుటకు రు. 10-0-0 లు ఈయవలెను. అరపుటకు రు. 6-0-0 లు. ఒక్కసారి నాలుగుపుటలు వేయువారికి రేటు తగ్గించబడును. అరపుటకన్న తక్కువ ప్రకటన తీసికొనబడదు.

5. మాకు ప్రతిదినము క్రొత్తక్రొత్త చందాదారులు వచ్చుచున్నందునను, మాగ్రంథములు ఆంధ్రభాషలో శాశ్వతముగ నుండునవి గనుకను ఇందొకసారి ప్రకటన వచ్చినయెడల అది భాషలో శాశ్వతముగ నుండును. వారపత్రికల, మాసపత్రికలవలె అప్పుడు మాత్రము చదివి అవలఁ బారవేయునట్టివి మాగ్రంథములుకావు. గనుక వీనియందు బ్రకటన వేయువారికి మిక్కిలి లాభముండు నని చెప్పవచ్చును.

మేనేజరు - విజ్ఞానచంద్రిక,
చింతాద్రిపేట, మదరాసు.

# విజ్ఞానచంద్రికా బుక్కుడిపో.

మా చందాదారులలో ననేకులును, చందాదారులు కానివారలలో పెక్కుమందియు తమకే గ్రంథము కావలసినను మాగ్రంథములతో పాటు పంపవలసినదిగా గోరుచు నుత్తరములు వ్రాయుచున్నారు. మావద్ద 'లేవు' 'లేవు' అని వ్రాయుటకు విసుగుగానున్నది. కాబట్టి ఆంధ్రభాషా సేవకు సమకట్టిన మావిధి మేము నెరవేర్పవలెనని యెంచి యితర గ్రంథము లేవయినను మేము పంపుటకు పూనుకొని "విజ్ఞాన చంద్రికా బుక్కుడిపో" యను పేరుతో నొక పుస్తకాలయమును, విజ్ఞానచంద్రికా గ్రంథమాలకు ఉపాంగముగా స్థాపించినాము. సంస్కృతములోని స్మృతులు, పురాణములు, నాటకములు, కావ్యములు, ఆంధ్రములోని ప్రబంధములు, నాటకములు, నవలలు, వచనకావ్యములు చరిత్రలు మున్నగు ఎట్టి గ్రంథము కావలసినను మాకు వ్రాయునెడల మేము సప్లయి చేయుదుము. మంచి పుస్తకములు నిజమైన వెలలకే ఇయ్యబడును. గ్రంథముల పేర్లు, చిరునామాలు పూర్తిగా విశదముగా తెలియులాగున వ్రాయవలెను. ఉత్తరములు ఇంగ్లీషున గాని తెలుగులోగాని వ్రాయవచ్చును.

చింతాద్రిపేట, మద్రాసు. } ఆ. లక్ష్మీపతి, బి.ఎ., ఎం.బి., సి.ఎం.,
మేనేజరు.

1911 సంవత్సరం

# విజ్ఞానచంద్రికాపరిషత్.

## పఠనీయగ్రంథములు.

| | వెల. |
|---|---|
| 1. గజేంద్రమోక్షము (బమ్మెరపోతరాజకృత భాగవతములోనిది) ప్రతిపద టీకా తాత్పర్యములతో అచ్చువేయఁబడినది. | 0 6 0 |
| 2. హిందూమహాయుగము; ఇది హిందూదేశచరిత్ర యొక్క ప్రథమభాగము. ఇందు మన పూర్వుల నిజమైన చరిత్ర వీరరసపూరితముగ వర్ణింపఁబడినది. | 1 0 0 |
| 3. ఈశ్వరచంద్ర విద్యాసాగరునిజీవితము. | 0 8 0 |
| 4. పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics) | 1 5 0 |
| 5. కలరా. (Cholera) | 0 6 0 |

☞ ఈ గ్రంథములు కావలసినను, పరిషత్ విషయమయి ఏమి తెలిసికొనవలసినను మాకు వ్రాసికొనవలెను. మొట్టమొదట ప్రకటించిన నోటీసులో రాజశేఖర చరిత్రనుగూడ నియమించియుంటిమి. కాని గ్రంథములు లేనందున దానిని పరీక్షా గ్రంథములలోనుండి తీసివేసినాము. అచ్చు అయిన దరఖాస్తుఫారములు గలవు. వలయువారికి పంపబడును.

సెక్రెటరీ - విజ్ఞానచంద్రికా పరిషత్,
చింతాద్రిపేట, మద్రాసు.

# హిందూసుందరి.

ఇది ప్రత్యేకము స్త్రీలకొఱకు ప్రచురింపఁబడు మాస పత్రిక. విదుషీమణియగు శ్రీమతి మొసలికంటి రామాబాయమ్మగారు దీనికి సంపాదకురాలు. ఇందు పాతివ్రత్యము, దైవభక్తి గృహిణీధర్మములు, శిశుపోషణము, గృహనిర్వాహక విధులు మొదలయిన స్త్రీల కత్యంతోపయుక్తములగు విషయములు పండితులగు నారీమణులచే వ్రాయఁబడుచుండును. పురాణకథలు, నవీనచరిత్రలు, ప్రహసనములు, పద్యములు, ఉపన్యాసములు, సాధ్వీమణుల జీవితములు ఇందు విశేషముగ నుండును. కుట్టుపనులు నేర్చుకొనువిధము, పూలచెట్లపెంచు రీతి, ఉపాధ్యాయుఁడక్కర లేకుండ విషయము బోధపడునంత సరసముగా బొమ్మలతో వ్రాయఁబడును. మంగళహారతులు, కీర్తనలు, పాటలు మొదలగునవి యుండును. ఈవిషయ మావిషయ మననేల అతివలకత్యంతావశ్యకములగు పలువిషయము లిందుండును. చదువనేర్చిన ప్రతిస్త్రీయొక్క చేత నుండఁదగినది.

☞ ఈకార్యాలయమునందు స్త్రీలవశ్యముగా పఠించవలసిన అనేకగ్రంథములు సరసమైన వెలకు దొఱకును.

చిరునామా :—

S. SITARAMIAH Esq, స. శీతారామయ్యగారు
*Kanteru, Krishna Dt.* కంతేరుపోస్టు, కృష్ణాజిల్లా.

# ఆంధ్రపత్రిక.

---

మంచికాగితము ! పెద్దయాకృతి !!

చక్కని అచ్చు !!! బహుచవుక !!!!

ఈ పత్రిక బొంబాయినుండి వెలువడుచున్నది. సకల దేశసమాచారములతోను, చిత్రపటములతోఁగూడిన దేశభక్తుల చరిత్రతోను నిండి చదువుటకు మహాయోగ్యముగానుండును. ఈపత్రిక నన్ని యాంధ్రపత్రికలకంటె చవుకయయి నన్నిటికంటెను పత్రబాహుళ్యమునందేగాక విషయబాహుళ్యమునందును సాటిలేనిదై, ఒకసారి చదివినవారి నెల్లప్పుడు నాకర్షించుచు ప్రతివారము తప్పక వెలువడుచు పెక్కండ్రు మహాపురుషుల మన్ననలను బొందుచున్నది. ప్రతి యాంధ్రుడు నాంధ్రపత్రికను తప్పక చదివి తీరవలయును.

చందా సం॥ ౧-కి రూ. 2 2 0 లు మాత్రమే.

చిరునామా :— మేనేజరు, ఆంధ్రపత్రిక

ఫోర్టు, బొంబాయి.

# భాషాభిమానులారా!

ఇప్పుడు సంపుటములుగా ముద్రింపఁబడియున్న రావుబహాదూరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారి పుస్తకములు పది సంపుటములును విక్రయమునకు సిద్ధముగానున్నవి. 26 పౌనుల గ్లేజుకాగితముమీఁద ముద్రింపఁబడి కాలికోగుడ్డతో నిండుగా బైండు చేయఁబడిన సంపుటములు ప్రత్యేకముగా నీ క్రింది వెలలకు దొరకును.

| | | | రు. | అ. |
|---|---|---|---|---|
| 1 | సంపుటము. | ప్రహసనములు. | 2 | 8 |
| 2 | ,, | నాటకములు. | 2 | 8 |
| 3 | ,, | భాషాంతరీకృత నాటకములు. | 3 | 0 |
| 4 | ,, | వచనప్రబంధములు, పద్యకావ్యములు. | 3 | 0 |
| 5 | ,, | స్త్రీలకుపయోగించు కథలు. | 3 | 0 |
| 6 | ,, | స్త్రీలకుపయోగించు పుస్తకములు. | 3 | 0 |
| 7 | ,, | ఉపన్యాసములు. | 2 | 0 |
| 8 | ,, | ఉపన్యాసములు, జీవనచరిత్రములు. | 3 | 0 |
| 9 | ,, | సాహిత్యప్రకృతిశాస్త్రగ్రంథములు. | 3 | 0 |
| 10 | ,, | కవిచరిత్రములు. | 3 | 8 |

అంచెకర్చాలి కొనువారే పెట్టుకొనవలయును. ఈసంపుటములపై గిల్టక్షరములు వేయబడియున్నవి. సంపుటములన్నియు మొత్తముగాఁ గొనువారికి సంపుటములు పదియు నిరువది (రు. 20-0-0) రూపాయలకే యియ్యఁబడును. విడిపుస్తకములుకూడ దొరకును. వలయువారు రావుబహదూరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారు రాజమహేంద్రవరము అని వ్రాసికొనవలయును.

# సావిత్రి.

హిందూదేశ స్త్రీలకు మహోపయోగమగునట్లుగా కాకినాడయందు శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారిచేఁ బ్రకటింపఁబడుచున్న మాసపత్రిక. ఇందు దేశాభివృద్ధికొఱకుఁ బాటుపడు విద్యావతుల జీవితములు, పటములు, పాతివ్రత్యము, సతీధర్మములు, గృహనిర్వాహకత్వము, శిశుపోషణము, చరిత్రాత్మకమైన స్త్రీలజీవితములు, పద్యగ్రంథములు, స్త్రీహితవచనములు, ఉపన్యాసములు, పాటలు మున్నగు పలువిషయము లిందుఁ బ్రచురింపఁబడుచుండును. విద్యాధికులగు స్త్రీలు, పురుషులుగూడ నీపత్రికకు సహాయులుగనున్నారు. విద్యనేర్చుకొనుచున్న చిన్న బాలికలకును, విద్యావతులగు స్త్రీలకును తక్కినవారెల్లరకును, నుపయోగించు విషయము లిందనేకము లుండును. దీనిని ప్రతివారు చదువఁగోరి స్వల్పమగు చందా యేర్పరుపఁబడినది.

సంవత్సరమునకు పోస్టుఖర్చులతో రు. 1-0-0 మాత్రమే

---

# ఆంధ్ర కేసరి.

ఇది ప్రగమనశీలమైన యొకవారపత్రిక.

జనోపయోగకరములగు సంగతులు నిర్భయముగ బోధించును. ఇందలి వ్యాసముల లోకోపయోగశీలతయు, భాషాసౌమ్యతయు ప్రశంసనీయములు. భాషాభివృద్ధియు దేశాభివృద్ధియుఁ గోరువారు ఈపత్రిక తప్పక చదువవలయును.

సంవత్సరమునకు చందా అంచెకూలితో రు. 3-0-0

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సు, రాజమండ్రీ.

---

# దేశమాత.

ఇది యొక వారపత్రిక. సంవత్సరమునకు చందా మూడురూపాయలు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు యీ పత్రికకు అధిపతి. ఇందు విదేశ వృత్తాంతములు, స్వదేశవార్తలు, చిత్రకథలు, హాస్యములు, ప్రకృతిశాస్త్రవిషయములు మొదలగునవి ప్రకటింపబడుచుండును. కావలసినవారు రాజమహేంద్రవరము పత్రికాధిపతిగారికి వ్రాసికొనవలయును.

# మనోరమ.

ఇది బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచేఁ బ్రచురింపఁబడు తెలుగు మాసపత్రిక. ఇందు వినోదములు దేశమునకు మతమునకు మహోపకారము చేసి కీర్తిశేషులయిన మహాపురుషుల జీవనచరిత్రలు సృష్టియందలి వైచిత్ర్యములను దెలియజేయు మహాద్భుతములు, రసవంతములై మృదుపదసంయుక్తములై యొప్పు నాటకములు నూతనకల్పనలతో నిండియుండి చదివిన కొలఁది చవులుగొల్పు చక్కనికథలు, చిత్రకల్పనలతో రచియించిన చిత్రవచన కావ్యములు (Novels) ప్రచురింపఁబడు చుండును. ఈమాసపత్రికను జదివిన వారందఱు దీనిని భాషాప్రౌఢిమగల పత్రికలలో నొకటియనియుఁ బండితులకుఁ బామరులకు స్త్రీలకు బాలురకు నత్యంతోపయుక్త మనియు నీతిదాయకమనియుఁ దలంపకపోరు. చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు, వలయువారు "మనోరమ పత్రికాధిపతిగారికి రాజమండ్రి" యని వ్రాసిన బడయఁగలరు.

---

# ప్రచండపాండవము.

చదువఁదగినది ! లేక ప్రదర్శింపఁదగినది !!

## కర్ణపర్వము.

ఇది 'విమలాదేవి' గ్రంథకర్తలగు మహారాజశ్రీ బాలకవి, భోగరాజు నారాయణమూర్తిగారిచే రచింపఁబడిన మనోహరమైన యొక నాటకము. ఇందలి ప్రతిపద్యమును వీరరసస్ఫురితమై చదువరుల కత్యుత్సాహమును గలిగించును. శైలి మృదుమధురశోభితమై దనరారుచుండును. కర్ణుని వీరాలాపములును, కర్ణాశ్వత్థామల వివాదమును వర్ణనాతీతములు. ధర్మజ కృష్ణార్జునుల సంభాషణము యుక్తియుక్తమై కడుంగడు నాశ్చర్యమును గలిగించును. ఆయాఘట్టములను జదువునప్పుడు చదువరులకు మైమరపు గల్గించును. బాలురు సైతము ప్రదర్శింపవచ్చును. దీనివెల 0–8–0 లు మాత్రమే. ఆరు పుస్తకములఁ గొనువారి కొక గ్రంథము బహుమానము. వలయువారు, గ్రంథకర్తగారికి బరంపురము వ్రాసికొనవలెను.

# ఈశ్వరవాదిని.

## సంవత్సరపుచందా రూపాయున్నర మాత్రమే.

ఇయ్యది సంఘమత సంస్కారణైక వ్యాసములును, మహాపురుషుల జీవితములును, ధర్మోపదేశములును, నీతివచనములును కలిగి మహావాక్యావళులతో నొప్పుచు చెన్నపట్టణమునుండి వెలువడు యాంధ్రమాసపత్రిక.

మ-రా-రా-శ్రీ, దుగ్గిరాల- వి. సూర్యప్రకాశరావుపంతులుగారు, బి. ఏ.
,, గోటేటి - కనకరాజుపంతులుగారు, బి. ఏ., బి. యల్.
,, రా - వెంకటశివుడుపంతులుగారు, బి. ఏ., యల్. టీ.
,, తేకుమళ్ల - రాజగోపాలరావుపంతులుగారు, బి. ఏ.
,, చిలుకూరి-వీరభద్రరావుపంతులుగారు, మున్నగు ప్రసిద్ధయాంధ్రలేఖకులచే నిందలి వ్యాసములు వ్రాయబడుచుండును. ఉదారయాధ్యాత్మిక విశ్వజనీనధర్మమును లోకమున వ్యాపింపజేసి పరమేశ్వరుని పితృత్వమును, మానవకోటియొక్క భ్రాతృత్వమును ఆంధ్రదేశమున నెలకొల్ప ప్రయత్నించు పత్రిక యిది యొక్కటియే గావున సత్యమతాన్వేషణుల యొక్కయు, సదాచారప్రతిష్ఠాపనా కౌశలులయొక్కయు, యాదరణమును నమ్మి పరమేశ్వరునిపై భారమునువైచి మేమీపనికి బూనితిమి. గావున దేశాభిమానులెల్లరును మాపత్రికను పోషింతురని నమ్ముచున్నాము.

ఉత్తరప్రత్యుత్తరములును, వ్యాసములును, పత్రికలును, విమర్శనమునకు నంపబడు గ్రంథముల నీక్రింది విలాసమునకే పంపబడవలయును. అర్ధణా తపాలచీటి నంపువారికి మాదిరిపత్రిక నుచితముగా పంపబడును.

ఇట్లు,

నెం. 3 అక్బరుసాహెబు వీధి,
ట్రిప్లికేన్, చెన్నపట్టణము.

☞ ఇ - సుబ్బుకృష్ణయ్య,
'ఈశ్వరవాదిని' పత్రికాధిపతి.

# శ శి లే ఖ.

16 సం॥ లనుండి వారమునకు రెండుసార్లు వంతున ముద్రింపబడు చుండు యీ తెనుగు వార్తాపత్రిక ౧౯౧౦ సం॥ అగష్టునుండి దినదినము, వారమునకు ముమ్మారు ప్రచురింపబడుచున్నది. చందావివరము.

## దినపత్రికకు.

| | | | |
|---|---|---|---|
| పోషకులకు సం॥ నకు | ... | ... | రు. 25-0-0. |

## చందాదారులకు.

| | | | | |
|---|---|---|---|---|
| సం॥ నకు పోస్టెజి సహా | | ... | ... | రు. 14-0-0. |
| ఆరు నెలలకు | ... | ... | ... | రు. 7-0-0. |
| మూడు నెలలకు | ... | ... | ... | రు. 3-8-0. |
| ఒక నెలకు | ... | ... | ... | రు. 1-4-0. |

## వారమునకు ముమ్మారు పత్రిక చందా.

| | | | | |
|---|---|---|---|---|
| సం॥ నకు | ... | ... | ... | రు. 7-0-0. |
| 6 నెలలకు | ... | ... | ... | రు. 3-8-0. |
| 3 నెలలకు | ... | ... | ... | రు. 2-0-0. |

ఇంతకుతక్కువ కాలమునకు చందా పుచ్చుకొనంబడదు. దీనిలో ఇండియావిషయమై ఇంగ్లాండు పార్లమెంటులో జరుగు చర్యలు, కాంగ్రెస్, ప్రావిన్షల్, జిల్లా, కన్ఫరెన్సులు, వైస్రాయి, గవర్నరుచేయు ఉపన్యాసములు, గొప్పవారి జీవితములు, కోర్టులలో విచారింపబడుచుండు సివిల్ క్రిమినల్ దావాల తీర్పులు, యుద్ధములు మొదలగు విశేషములు జరిగినపుడు తత్సంబంధములగు టెలిగ్రాములు జాబులు, దూది, బంగారము వెండి గవర్నమెంటు పత్రములు బాంకిషేర్లు మొదలగువాని ధరలు, నీతిమతా విద్యావిషయములతో సంబంధించిన ఉపన్యాసములు, శాసన నిర్మాణసభలో జరుగు చర్చలు ప్రశ్నోత్తరములు వ్రాయబడు చుండును. దీని జదివిచూచినచో ఇట్టి తెనుగు పత్రిక యింకొకటిలేదని సారసజ్ఞులకు విశదమగును.

ఇట్లు

గట్టుపల్లి - శేషాచార్యులు,

శశిలేఖ ఆఫీసు, జార్జిటవున్, మద్రాస్.

ప్రతులుతక్కువ. త్వరపడుడు.

# శ్రీ కళాభిలాషక కావ్యమాలిక.

ఇందు, భాషాభివృద్ధికి సాధనములగు కావ్యనాటకాదులు, నిఘంటు వ్యాకరణాద్యులు, శాస్త్రచరిత్రాదులు, ప్రకటితములగును.

ఇందలి పుస్తకములన్నియుం గొననొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులు. పుస్తకములు పంపినపుడు వెలయిచ్చి పుచ్చుకొనుటయెకాని, ముందే చందా యియ్యనక్కఱలేదు. ప్రవేశరుసుము రు 0-4-0 ఇది దరఖాస్తుతో పంపవలెను.

క్రౌను సైజు గ్రంథములు, అంచెకూలిగాక, ౧౦౦ పుటలకు 0-4-0 చొప్పునను, డెమీసైజువి ౧౦౦ పుటలకు 0-6-0 చొప్పునను, చందాదాతల కిచ్చెదము.

రు ౧౦౦ లకు తక్కువకాని ధనసాహాయ్యము చేయువారు నిత్యపోషకులు. రు ౨౫ లకు తక్కువకాని ధనసాహాయ్యము చేయువారు నిత్య సహాయకులు. వారికి మాకావ్యమాలికా పుస్తకములన్నియు నిచ్చుచు, వారిపేర్లు ప్రతిపుస్తకమందును ప్రచురపరతుము.

## బహుమానములు

౧౫ గురు చందాదారులను చేర్చువారికి మాకావ్యమాలికా పుస్తకములన్నియును, ౪ గురిని చేర్చినవారికి కోరిన పుస్తకమొకటియును, బహుమానముగా ఇచ్చెదము.

## అచ్చుపడినపుస్తకములు.

| అంచెకూలిగాక. | పైవారికి. | చందాదారులకు. |
|---|---|---|
| తెలుఁగుసంధ్యావందనము. | 0-2-0. | 0-1-6. |
| మానవవిధి. (సంవాదము.) | 0-0-6. | 0-0-3. |
| కన్యకాంబికావిజయము. (నాటకము.) | 0-8-0. | 0-6-0. |
| బిల్హణీయము. (నాటకము.) | 0-8-0. | 0-6-0. |
| పారిజాతాపహరణము. (నాటకము.) | 0-8-0. | 0-6-0. |

విశాఖపట్టణము,
1910 సం॥

మారేపల్లి రామచంద్రశాస్త్రి,
శ్రీకళాభిలాషకసమాజాధిపతి.

# ఆంధ్ర
# వచనభాగవతము

శ్రీమన్నారాయణాంశ సంభూతుఁడైన వేదవ్యాసమహాముని సంస్కృతభాషను రచించిన శ్రీమద్భాగవతమును బమ్మెరపోతనామాత్యుఁడు గద్యపద్యాత్మకముగా రచియించుట లోకప్రసిద్ధంబుగదా. అయ్యది పద్యబహుళము గావున నందఱకును దానియర్థము గోచరింపకుండుటవలనను, మూలముకంటెఁ గొన్ని విషయము లధికముగాఁ జేర్పఁబడి యుండుటవలనను సులభశైలిని దెనుఁగున వచనకావ్యముగ సంస్కృతానుసారముగా రచియింపఁ జేసి ముద్రించి ప్రచురించుట యీకాలమున నవశ్యమని తలఁచి శ్రీకాళహస్తిలోనుండు బ్రహ్మశ్రీ, శతఘంటము వేంకటరంగశాస్త్రులుగారిచే మూలమునకుఁ గొంచెమేనియు భేదము లేకుండ సులభశైలిని వచనముగాఁ దెనిఁగింపఁ జేసి ముద్రించి ప్రచురింపఁ బూనితిమి.

నవమస్కంధమువఱకు రెండుసంపుటములుగను, దశమైకాదశద్వాదశస్కంధము లొక్కసంపుటముగను మూడుసంపుటములుగా 1911 సంవత్సరము జనవరి, మే, సెప్టంబరు నెలలకడపట మూఁడుపర్యాయములుగాఁ బ్రకటించెదము. డెమ్మి 8 పుటలసైజున మేలైన కాగితములమీఁద మంచి యక్షరములతో ముద్రించి దృఢమగు కాలికోబైండు కట్టించి చందాదారులుగ నున్నవారికిఁ బంపుదుము.

చందానిబంధనలు.

| | | |
|---|---|---|
| పోషకులకు | ... ... | రు. 12-0-0 |
| చందాదారులకు | ... ... | ,, 6-0-0 |

1910 సం॥రం డిశంబరులోపల మూల్యమంతయుఁ బంపువారు పోస్టేజి ప్రత్యేక మియ్యనక్కఱలేదు. పుస్తకమంతయు ముద్రించినపిమ్మట వెల సుమారు రు 7-8-0 కాఁగలదు.

## నూతనముగ ముద్రింపఁబడ్డ గ్రంథములు.

రంగనాథరామాయణము.—వ్రాఁతప్రతులను ముద్రితప్రతులనుజూచి బ్ర॥శ్రీ, వైఖరి. సుందరరామయ్యగారు పరిష్కరించియున్నారు. బ్ర॥శ్రీ

నాగపూడి. కుప్పుస్వామయ్య, బి. ఏ. గారిపీఠిక యిందుగలదు. చక్కని ప్రతి రు. 2-8-0.

రాఘవపాండవీయము.—ఇది టీకాదులతో అనేకములగు ప్రతుల జూచి ముద్రింపఁబడ్డది. బ్రా॥శ్రీ, శతఘంటము. వేంకటరంగశాస్త్రీగారి పీఠిక యిందున్నది. ప్రతి 1-కి రు. 1-8-0.

కళాపూర్ణోదయము.—మంచికాగితములమీఁద తప్పులసవరించి పెద్ద అక్షరములతో ముద్రించినారము. రాజశ్రీ, కట్టమంచి. రామలింగారెడ్డి, ఎం.ఏ. గారు విపులమగు పీఠికను వ్రాయుచున్నారు. 1-కి రు. 1-8-0.

వసుచరిత్రము.—అనేక వ్రాఁత ప్రతులఁజూచి చక్కగ బ్రా॥శ్రీ కొంతి. భద్రాద్రిరామశాస్త్రీగారు పరిష్కరించిరి. 1-కి రు. 2-8-0. శ్రేష్ఠమగు (అనగా పెదరైటు) కాకితము ప్రతి 1-కి రు. 4-0-0.

అప్పకవీయము.—తప్పులులేకుండ మంచికాగితములమీఁద చక్కగ ప్రకటించినారము. 1-కి రు. 1-6-0.

రామకర్ణామృత—ఆంధ్రపద్య తాత్పర్యసహితము, చక్కనికూర్పు 1-కి రు. 1-4-0

భగవద్గీతలు.—ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము, మేలు కాకితములు, చక్కనికూర్పు. 1-కి రు. 1-8-0.

| | | | |
|---|---|---|---|
| వేమనపద్యములు, చక్కని కూర్పు. | ... | ... | 1-కి 0-4-0. |
| రుక్మిణీకల్యాణము, సటీక. ,, | ... | ... | 1-కి 0-6-0. |
| సుమతిశతకము, ,, ,, | ... | ... | 1-కి 0-2-0. |

ఇవిమొదలుగాగల సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద నున్నవి. కోరినచో క్రొత్త క్యాటలాగుల పంపుదుము. మా ముద్రాక్షరశాల యందితరుల అచ్చుపనులను అతివేగముగ సులువైన చార్జీలకు చేసియిచ్చెదము.

వావిళ్ల - రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

323, తండియార్ పేట

బ్రాంచీ.—రాజమండ్రి. 192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

ఆయుర్వేదమార్తాండ, భిషజ్మణి
పండిత డి. గోపాలాచార్లువారిచే ఆంధ్రీకరింపబడిన ఆయుర్వేద గ్రంథములు

# మాధవనిదానము.

(అనేక వ్యాఖ్యాతల యభిప్రాయములతోడను, చరకసుశ్రుతవాగ్భటాదుల మతములతోడను వ్రాయబడినది.)

1. వైద్యుల సహాయములేకయే సులభముగ వ్యాధులను గుర్తించునటుల జేయుటయందు దీనినిమించిన గ్రంథమింకొకటి లేదు.

2. జ్వరము, అతిసారము, పాండు, సంజు, మొదలగు 100 ప్రధాన వ్యాధులయొక్కయు, వాని అంతర్భూతములగు 1000 రోగములయొక్కయు పుట్టుటకు కారణములను, అవి రాబోవు లక్షణములను, వాని నిజస్వరూపములను, విశేషముగ వ్యాపించు రీతులను, వానిసంఖ్యాభేదములను, సాధ్యాసాధ్య లక్షణములను, వ్యాధులు కుదరవనుటకు సూచించెడు ఉపద్రవములను, ఇట్టియనేక విషయములనన్నింటిని ఈగ్రంథము విపులముగ సూచించుచున్నది. ఈ గ్రంథము సంస్కృతమున గల మధుకోశ, ఆతంకదర్పణము, పంజిక, మొదలగు వ్యాఖ్యానముల ననుసరించి యీ భాషాంతరీకరింపబడినది. సామాన్యముగ వ్రాయబడిన ఆంధ్రటీకలవలెగాక అనేక విషయములతో నిమిడియున్నది. సంస్కృతమురానివారికిని, ఆంధ్రభాష సామాన్యముగవచ్చినవారికిని, వైద్యసామాన్యులకును మిక్కిలి యుపయోగము.

దీనివెల పోస్టుఖర్చులుగాక రు 3-0-0.

# ఆయుర్వేదము.

ఆయుర్వేద వైద్యము ఏకాలమునుండి ఆరంభమైనది, అందు ఏయే విషయములు గలవు, వాని విభాగములు, శస్త్రవైద్యముయొక్క అభివృద్ధి, ప్రకృతకాలమున మనభరతఖండమున నాయుర్వేద మెట్లభివృద్ధియగుచున్నది, ముందుకెట్లు అభివృద్ధికి దెచ్చుకొనవలెనను విషయములు చక్కగ చర్చించబడియున్నవి. దీనివెల పోస్టుఖర్చులుగాక రు. 0-4-0.

ఆయుర్వేదమార్తాండ, భిషజ్మణి
పండిత డి. గోపాలాచార్యులు, ఎ. వి. యస్.,
ఆయుర్వేదాశ్రమం, 55, ఆచారప్పన్ వీధి, జార్జిటౌన్, మదరాస్.

# వీరేశలింగకవిచరిత్రము.

పెద్ద యక్షరములతో 359 పుటలుగలది. మంచి పద్యములుగలవు. అందఱును జదివి చూడఁదగినది. ఆర్టుగ్లేజు పేపరు మీఁద ముద్రింపఁబడిన 3 ప్రతిబింబము లిందుగలవు.

వెల వి.పి. కర్చులతో రు. 1-3-0 లు మాత్రమే.

అడ్రెసు :— తోలేటి—వెంకటసుబ్బారావు,
ఆర్యాపురము.
రాజమహేంద్రవరము.

---

# నిత్యానుసంధానగ్రంథము.

ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యసహితమైనది.

ఇట్టి సంపూర్ణగ్రంథమును మేము ప్రఖ్యాతికెక్కిన పండితులతో విచారించి ఉపయుక్తములగు అనేక అంశములను చేర్చి ముద్రించినాము. ఇందు శ్రీజయంతిలోనగు తిరునక్షత్రాది విశేష దినములందనుసంధింపఁదగిన తిరుమొళ్లులకును తిరుప్పావైస్వాప దేశార్థములతో నాలాయిరము నందలి కొన్ని ముఖ్యమగు తిరుమొళ్లులును, వీనికన్నిటికిని పూర్వాచార్య వ్యాఖ్యానములను ఉరై మొదలగువానిని అనుసరించి రచింపఁబడినది. మంచి గ్లేజుకాగితములలో ముద్రించి ప్రకటింపబడియె. రంగురంగుల అంచులు (Marble dipping) కలిగి, కెల్తాను బైండు చేయఁబడినది 728 పుటలుగలవు. నిత్యతిరువారాధనమునకు మిగుల యనుకూలము. కొద్దిప్రతులే నిలవయున్నవి. వెలర్పు 2-4-0 మాత్రమే

చరమోపాయ నిర్ణయం వెల రూ 0-4-0

చిరునామా :— రా. శ్రీనివాసరామానుజయ్య
7 మొదటి నారాయణ వీధి మింటుబిల్డింగ్సు పోస్టు, మద్రాసు.

# ఆంధ్ర గ్రంథములు.

| | |
|---|---|
| శ్రీప్రబంధరాజ వెంకటేశ్వరవిజయవిలాసము ... ... | 2-0-0 |
| మిత్రవిందాపరిణయము (రసవత్తరమగు ప్రబంధము) ... | 1-0-0 |
| చంద్రాంగదచరిత్రము (ప్రౌఢకావ్యము) ... ... | 1-0-0 |
| బిల్వేశ్వరీయకృతివిమర్శనము ... ... ... | 0-4-0 |
| శృంగారనైషధము ... ... ... ... | 0-10-0 |
| విజయవిలాసము. ... ... ... ... | 0-4-0 |
| వైజయంతీవిలాసము ... ... ... | 0-6-0 |
| బిల్హణీయము ... ... ... ... | 0-4-0 |
| ప్రియదర్శిక నాటకము ... ... ... ... | 0-6-0 |
| ఉషానాటకము ... ... ... ... | 0-10-0 |
| శాకుంతలనాటకము ... ... ... ... | 0-12-0 |
| సారంగధరచరిత్రము (చక్కని ప్రతి) ... ... | 1-4-0 |
| అముద్రితగ్రంథచింతామణీ మయూఖము విద్యార్థులకు మిక్కిలి యుపయోగము. | 7-0-0 |
| సటీకా హరిశ్చంద్ర నళోపాఖ్యానము ... ... | 3-0-0 |
| భర్తృహరి నీతిశతకము (పుష్పగిరితిమ్మనది.) ... ... | 0-4-0 |
| భర్తృహరి (సంస్కృతము, ఏనుగు లక్ష్మణకవి పద్యములు అర్థతాత్పర్యములుగలవు. అందమగు బైండు. | 2-0-0 |
| కుమారీశతకము చక్కని అచ్చు ... ... | 0-2-0 |
| దాశరథీశతకము ... ... ... ... | 0-4-0 |
| సుమతిశతకము ... ... ... ... | 0-2-0 |

☞ ఇంక ననేక గ్రంథములు గలవు.

విజ్ఞానచంద్రికా బుక్కుడిపో,

చింతాద్రిపేట, మద్రాసు.

# మానవ సేవ.

మతసంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

సచిత్ర మాస పత్రిక.

రాజమహేంద్రవరము

పత్రికా సంపాదకులు :—కందుల శ్రీమన్నారాయణ. నాళము కృష్ణారావు.

భూమండలమున మన భరతఖండము తక్క తక్కిన దేశము లెల్ల నాగరికాగ్రగణ్యములై సమస్త సౌఖ్యములతోఁ దులతూగుచు భూలోక స్వర్గములో యన భాసిల్లుచున్నవి. నిన్న మొన్నటివఱకును గన్నులు దెరువని విదేశీయులు తమ గాఢనిద్రనుండి మేల్కాంచి యొక్క పెట్టున మహోన్నతదశ నందుచున్నారు.

అనేక శతాబ్దములకు బూర్వమే లోకపూజ్యులగు మహర్షులచేతను, జగద్విఖ్యాతయశులగు చక్రవర్తులచేతను, దేశభక్తులగు ప్రజలచేతను ప్రకాశించుచు సకలలోకగురు పీఠము నధిష్ఠించిన మన భరతవర్షము నేఁడు కళావిహీనమై యధఃపతితమగుచున్నది.

అశేష శేముషీ దురంధరు లహోరాత్రములు శ్రమపడి సముపార్జించిన జ్యోతిశ్శాస్త్రము గగన కుసుమమైనది. వైద్యశాస్త్రములు మందునకైన గానరాకున్నవి. శిల్పములు స్వల్పములైనవి. చేతిపనులు చేజారిపోయినవి.

అజ్ఞాన వ్యాధిగ్రస్తమై ప్రాణమాత్రావశిష్టమైయున్న మనదేశదేహమును సమయ సముచితోపాయ సిద్ధౌషధ సేవనంబున నారోగ్య భాగ్యయుక్తముగఁ జేయక కతిపయకాల ముపేక్షించితిమేని యపాయము సంభవించును. కావున మన యార్యసన్మతమును సముద్ధరింపవలయును. మనయాచారముల సంస్కరించుకొనవలయును. ప్రకృతి శాస్త్రముల బలపరచుకొనవలయును.

ఇవ్విధమున మానవసేవ సేయవలయునని యే యీ 'మానవసేవ'ను నెలకొల్పినారము. మానవసేవయె దేశసేవయు, దేశసేవయె, యీశ్వరసేవయు గావున దీనిం జేపట్టి మీపట్టివలెఁ బోషించుభారము మీపయిం బెట్టినారము.

64 పుటలను గలిగి చిత్రపటశోభితమై విలసిల్లు నీపత్రిక సర్వజన సులభముగ నుండునట్లు సంవత్సరమునకు రు 3 లు మాత్రమె చందా నేర్పరచినారము. అభిమానులకు రు 5 లు ; పోషకులకు రు 10 లు ; రాజపోషకుల యాదరము వారి యనుగ్రహాధీనము.

# విజ్ఞానచంద్రికామణ్డలి.

## గ్రంథ విమర్శనము.

---

ఈమండలి సంపాదకుని పేర గ్రంథకర్తలనేకులు తమ గ్రంథములను విమర్శనార్థమయి పంపుచున్నారు. అట్టివారికి సంపాదకుని యభిప్రాయములను ఉత్తరముల మూలకముగాఁ దెలియపఱచుచుంటిమి. ఇట్లు ప్రత్యేకముగాఁ దెలియఁబఱచుటకంటె మా గ్రంథాంతమునందు ప్రకటించుట గ్రంథకర్తలకును భాషాభివృద్ధికిని అనుకూలమగునని యెంచి యింతటినుండి ఈమండలివారు మూడుమాసముల కొకసారి తెలుఁగు గ్రంథములను విమర్శించి, తమ గ్రంథముల చివరను బ్రకటించుటకు నిశ్చయించుకొని యున్నారు. కావున తమ గ్రంథముల విమర్శనకు పంపు గ్రంథకర్తలందఱును 'మానేజరు విజ్ఞానచంద్రిక చింతాద్రిపేట, మద్రాసు.' అనువారికి పంపుకొనవలయును.

ఇట్లు,

ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి., సి.ఎం.,

మేనేజరు.